సంపుటము 1] జూలై 1914 [సంచిక 1

# బాలమిత్ర

బాలికా బాలురకు దేవు— బాగొనర్చి
లవిని చేకూర్చినయ విద్య— లందవిర్చి
మిథ్యఁ బోఁగార్చి ధీఁ గూర్చి — మిరఁదనర్చి
త్రచ్ఛురహి "బాలమిత్ర" చి— త్రంబమర్చి"

ప్రియులగు బాల, బాలికలారా!

సలాం, సలాం. ప్రతిమాసమున మిమ్మును చూచుటకు మీ యింటికి వత్తును. నన్ను చూచుట మీ కిష్టమేనా? నేనెందుకు వచ్చుచున్నానో తెలియునా? వినండి. చెప్పెదను. ఇతర పిల్లలు, దేశములు, మృగములు, పురుగులు, చెట్లు, పువ్వులు, ఆటలు మొదలగువానిగూర్చి మీకు చెప్పుటకే. మనము కూర్చుండి ఖులాసగా కాలక్షేపము చేయవచ్చునుగదా? మన ప్రియ తండ్రియగు దేవునిగూర్చి కూడా మరెక్కువగా నేర్చుకొని ఆయనను ఎక్కువగా ప్రేమించవచ్చును. నన్నుగూర్చి మీ స్నేహితులందరకు దెల్పి, వారుకూడా నన్ను తమ జతకానిగా జేసికొనునట్లు దయచేసి తెలుపుదురుగదా! మరువకండి. మీకు నా సలాములు.

ఇట్లు మీ నూతన
"బాలమిత్ర"

# ముగ్గురన్నదమ్ములు, భిక్షగాఁడు

ధర్మపురమను గ్రామములో, కడుపేదలగు ముగ్గురన్నదమ్ములు కాపురముండిరి. వారింటిదగ్గిర ఒక మామిడి చెట్టుండెను. దాని కాయలను వారు ముగ్గురు పంచుకొనే వారు. ఒకరి తరువాత నొకరు వంతుల ప్రకార మా చెట్టును కాయుచుండిరి.

ఒకనాడొక భిక్షగాఁడాదోవను వెళ్లుచు, ఆ చెట్టు యొద్దకువచ్చి, వారిలో ఒకఁడక్కడ యుండఁగా కొన్ని పండ్లిమ్మని యడిగెను. "ఇదిగో! ఇవి నా భాగమునకు వచ్చిన పండ్లు. వీటిని తీసికొనుము. గాని నా సహోదరు లిచ్చుటలేరు గనుక వారివి నే నివ్వలేన"ని యత డుత్తరమిచ్చెను. ఆ పేద వాడు ముగ్గురియొద్దకు ప్రత్యేకముగా వెళ్లి అదే జవాబు విని యాశ్చర్యపడెను. వారి మంచి ప్రవర్తనకు మెచ్చుకొని, నీకేమి కావలెనని మొదటివాని నడిగెను. వాడు పేదగా కను పడుచున్నను, దేవదూతయని తలంచి, "నాకొక నుంచి మామిడితోట కావలెన"నెను, అప్పుడు అతడు వాని వెంట బెట్టుకొని ఒక వనములోకి వెళ్లి దాని వానికిచ్చి, "ఇది నీది. దీని ననుభవించుకొమ్మ"ని చెప్పి రెండవవానియొద్దకు తిరిగి వచ్చెను.

రెండవవాడు తనకు, "మంచి పాడి ఆవులమంద కావలె న"ని కోరగా, వానిని కొండ ప్రదేశములకు తీసికొనిపోయి, అక్కడ పచ్చిక బయళ్లమీద మేయుచున్న మంద నొకదాని నిచ్చి, మూడవవాని యొద్దకువచ్చి, "నీకేమి కావలెన"ని యడిగెను.

"బుద్ధిగల మంచిభార్య కావలెనని" వాడు చెప్పగా, ఆ భిక్షుకుడు "అయ్యో నీవు కోరినవరము దొరకుట కొంచెము కష్టమే" అని వెళ్లి, కొంచెము కాలమైనపిదప ఒక చక్కని మంచి కన్యకను తెచ్చెను. ఇతడామెను పెండ్లిజేసికొని అక్కడ బహు సుఖముగా కాలము గడుపుచుండెను.

కొంతకాలమైనపిదప ఆ పేదవాడు మరియొకవిధముగా వేషము వేసికొని మొదటివానియొద్దకువెళ్లి కొన్ని మామిడి పండ్లిమ్మనగా, వాడు, "పండ్లూలేవు గింజ్లూలేవు, పో పొమ్ము"ని వెళ్లగొట్టెను. అప్పుడతడు "నీవీతోట ననుభవింప తగిన వాడవు కావ"ని చెప్పి, వానిని ఎప్పటి దరిద్రస్థితిలోనుంచి వెళ్లెను. రెండవవానియొద్దకు వెళ్లి కొంచెము పాలిమ్మనగా వాడు, "ఛీ, ఛీ, నీవంటి భిక్షుగానికి పాలు కావలెనా?"యని చీదరించుకొనెను. అప్పుడు వాడు, "నీవును ఈ మందను కాయుట కయోగ్యుడవు. నీ యన్నయొద్దకు వెళ్లుము"ని వానిని కూడ తరిమివేసెను.

తరువాత వాడు మూడవవానియొద్దకు వెళ్లి కొంచెము అన్నము పెట్టుమని యడిగెను. అప్పుడు వాడు, "అయ్యా! లోపలికిరా. మేమును పేదవారమే. గాని మాకు కలిగిన గంజే త్రాగుదుముగాని" అని వాని లోపలికి గొనిపోయి, తమ కున్నదానితో తృప్తిపర్చి, పండుకొనుటకు తావుచూపి మర్యాద జేసిరి. మరునాటి ఉదయమున వాడు వెళ్లుచు, వారి కొక గోనెనుచూపి, నేను వెళ్లిన తరువాత దీనిని విప్పుడని చెప్పి వెళ్లెను. తరువాత వారు దాని విప్పగా దాని నిండ బంగారు నాణెములున్నట్లు తెలిసికొని బహు సంతోషించిరి. వీరు వాటిని చాలకాలమువరకనుభవించుచు, తమ సహోదరులకు సహాయముచేయుచు, బీదలకు ధర్మముచేయుచు, జీవించిరి.

---

## రాజభక్తిని గూర్చిన కథ

అనేక సంవత్సరముల క్రిందట ఐరోపా ఖండమం దొక రాజు పరిశుద్ధపుర మనఁబడు యెరూషలేము పట్టణమును దర్శింప వెళ్లెనట. తాను ఆ పట్టణమును చూచి తిరుగ తన స్వదేశమునకు బోవుచుండఁగా మార్గమందు శత్రువుల వలనఁ బట్టుకొనఁబడి బందీగృహములో వేయఁబడెను. తా



నెక్కడ నున్నది తన బంధువులకైనను, తన స్నేహితులకైనను తెలియలేదు.

రాజు బహుగా ప్రేమించిన యొక గాయకుడు చెఱపట్టఁబడిన తన రాజును వెతుకనుద్దేశించి మిక్కిలి సాహసముగలవాడై ప్రయాణమై బైలుదేరెను. అనేక దినము లీ విధముగా వెతుకుచు సంచరించినను తన ప్రయత్నము వ్యర్థమాయెను.

తుదకు ఒకానొక దినమొక చెఱశాల కిటికీ యెదుట నిలుచుండి ఒక కీర్తనను పాడుచుండఁగా ఆ రాజు వెంటనే గాయకుని యొక్క శబ్దమును విని తాను ప్రేమించిన గాయకుఁడని గుర్తించి ఆ గాయకుని విషయము మాట్లాడుచుండ రాజుగారి స్వరమును గాయకుఁడు గుర్తించి రాజుగారు ఆ కారాగృహములో నున్నారని తెలుసుకొనెను. తరువాత ఆయనను ఖైదులోనుండి విడిపించ సాహాయ్యపడెను.

రాజు గాయకుని ప్రేమించినందున గాయకుఁడు రాజుయెడల భక్తియు, విశ్వాసము గలవాఁడై యుండెనో చూచితిరా? మన దేశమును ప్రేమించుచు మన దేశ క్షేమంబును గోరు మన చక్రవర్తియెడల మనము సహో రాజభక్తిఁ గలవారమై యుండవలెను.

## పగడపు పురుగులు



సముద్రపు టడుగు భాగమం దుండెడి పురుగు లెంత చిన్నవి! కంటికి కానరాని నలుసులంత చిన్నవి. వీటిలో ప్రతిదియు సముద్రపు నీటిని త్రాగునప్పుడు కొంచెము సున్నము వాటి కడుపులో ప్రవేశించును. ఈ సున్నముతో నది దాని శరీరముపై నొక చిన్న యింటిని కట్టుకొనును. కొంత కాలమున కది తన యింటిని విడిచి చనిపోవును. ఈలాగున కోట్లకొలది పురుగులు తమ తమ యిండ్లను కట్టు

ాని చనిపోవును. వీటియిండ్లు ఒకదానితో నొకటి కలిసికొని లయాకారముగా పెరిగి, పెరిగి నీళ్లపైకి క్రమక్రమముగా లేచును. ప్రస్తుతము పైన ఉండు పగడములు అనేక వందల సంవత్సరముల క్రిందట కట్టబడినవి గదా. అవి నల్లగా నుండుటకు కారణమేమి? సముద్ర తరంగములచే తీసికొనిరాబడు నాచు, మొదలైనవా పగడములమీద జేరి పేరుకొని యుండును. ఆకసమున యెగిరెడి పక్షు లిక్కడ విడచిన విత్తనము మొలిచినందున, ఆ చిన్న యిండ్లమీద వచ్చిక, మొక్కలు, చెట్లు పెరిగియుండుట చూడవచ్చును. ఈలాగు మధ్య నీరుగల ఒక గుండ్రటి ద్వీప మొక్కటి అక్కడ యేర్పడును. ఉండగా ఉండగా, ఎక్కువ నాచు, యితర పదార్థములు వచ్చి యిక్కడ జేరి, ఎక్కువ వృక్షములు మొలచును. పక్షులు మృగములు మొదలగునవియు, చివరకు మనుష్యుడును అక్కడ జేరును. ఈలాగు తమ తాతముత్తాతలు పుట్టక ముందరనే దేవుని సృష్టియగు ఈ పగడపు పురుగులవలన కట్టబడిన ఈ దీవులు మానవులకు నివాస యోగ్యములగుచున్నవి.

ఇంత చిన్న పురుగులను దేవుడు తన పనికై వినియోగించుచుండగా, పిల్లలమైన మనము ఆయనకు లోబడి, వాటివలె మనము చేయవలసినది జేసినయెడల, ఆయన మన ద్వారా మరీ యెక్కువ పనులజేయును.

---

# దొంగను కనుగొను విధము

ఒకానొక బ్రాహ్మణుని సేవకులలో నెవఁడో అయన జేబు గడియారమును దొంగిలించెను. దానిని తీసినవాని కనిపెట్టుట కాతఁడొక యుపాయమున్ని తన సేవకులనందఱిని బిలచి సమానమైన పొడవుగల పుల్లల నొక్కొక్కటి వారికిచ్చి వానిని అందఱు భూమిలో పాతి నీళ్లు పోయవలెనని యు దొంగిలినవాని పుల్ల రేపటికొక అంగుళము పొడవు పెరుఁగుననియు చెప్పెను. "గుమ్మడికాయల దొంగ యెవరన తన భుజములు తానే తడవి చూచుకొన్నట్లు" దొంగవాఁడా మాట విని తన పుల్లలో ఒక అంగుళము పొడవు విఱిచి మిగిలి నది పాతిపెట్టెను. మఱుసటి దినము వారందఱిపుల్లలు తెప్పించి కొలిచి చూడగ నది చిన్నదిగా నుండెను. గాన వాఁడే యని నిర్ధారణ చేసిరి.

## మూగ భిక్షుకుఁడు

ఒక భిక్షుకుఁడు తాను మూఁగవాఁడుగా నటించిన ఎక్కువ సొమ్ము సంపాదింపవచ్చునని తలచి "మూగవాఁడు" అను మాట చెక్కిన బిళ్లొకటి మెడకు గట్టుకొని భిక్షముకొఱకు త్రోవప్రక్కను కూర్చుండెను. వాని విరోధి యొకఁడు తెలిసికొని వాని టక్కరితనము బైలుపెట్ట నిశ్చయించి

ాపుననే కూర్చుండి యుండెను. ఇంతలో నొక ధర్మాత్ముఁడా ారిని రా తటస్థించెను. వాఁడా మూఁగ భిక్షుకుని చూచి కని రపడి భిక్షమియ్యఁబోఁగా దాపున నున్నవాఁడు "అయ్యా వాఁడు దొంగ. మూఁగవాఁడు కానేకాఁడు" అని చెప్పెను. ఆ మాట వినగానే ఆ మూఁగ భిక్షుకుఁడు తనకు ఎక్కుడలేని కోపము వచ్చినందున మైమఱచినవాఁడై "ఓరీ అబద్ధికుఁడా నేను చాలకాలమునుండి మూఁగవాఁడను. ఇప్పుడును మూఁగ వాఁడనే" అని బిగ్గరగా అనెను. దానిని వినినవారందఱును వాఁడు టక్కరి అని గ్రహించిరి. వాని ఉపాయమున కెంతయు నచ్చెరువొందిరి.

## సిరా, అద్దుడు కాగితము

ఒకానొక రోగి కొక వైద్యుఁడు సిరారంగు కలిగిన మందిచ్చెను. ఒకదిన మాతని సేవకుఁడాతనికి పొరబాటువలన మందుకు బదులు సిరా పోసి యిచ్చెను. కొంత సేపటికి మందు త్రాగివేసిన తరువాత తన తప్పు గ్రహించి పరుగిడుచు వచ్చి, "అయ్యా నేను పొరబాటుగా సిరాపోసి యిచ్చినానండీ" అని చెప్పగా వాని యజమానుఁడు "సరి, ఇప్పుడు నేను మాత్రమేమి జేయగలను? ఒక అద్దుడు కాగితము తీసికొనిరా. దాని నమిలి మ్రింగుడు" ననెను. మంచి విరుగుడు గదా!

# నీతిబోధకమగు పక్షుల యుద్ధము

కాకి. – యడవిమార్గమున యాహారార్థమై జనుచుండ,

గద్ద చూచి

గద్ద. – ఓహో ప్రియ మిత్రమా యెచ్చటకేగెదవు?

కాకి. – ఆహారార్థమై యరణ్యమునకు జనుచున్నాను.

గద్ద. – అయితే సంఘీ భావము, బలమని యున్నది గనుక మీరు మేము కలసి జతగూడి, నే యాహారము దొరకినను సమముగా పంచి తిని జీవింతము అని చెప్ప,

కాకి. – (తనలో, గద్దలు చాలా వడిగలవి గనుక వాటివల్ల మనకు మిక్కిలి లాభము కలుగవచ్చును. అని దారిని యిరుపక్షములవారు పోవుచుండ దారిలో, నేలకాని బాణగాయమువల్ల లేవలేక బాధపడుచున్న ఒక్క నక్కను చూచి దానిని తినగోరి కాకి గద్దతో) "మేము పయిభాగమునకు అర్హులము గనుక మాకు పయిభాగ ము కావలయున"నెను.

గద్ద. – సరే? భక్షింపుడు అని యిష్టపడెను.

(అంత, నేల గాయములతో పడియున్న ఆ నక్క మూలుగుచు యిట్లనెను.)

నక్క.- నేను చావనై కొన ప్రాణమున గాయమువల్ల బాధ పడుచున్నాను, నేను యెప్పుడైనను చచ్చేదాననే. ఇప్పుడన్ననో నా ఫలిత మీడేరెను. నన్ను శీఘ్రముగా చంపి తిని పాపము విమోచనము చేయుడు. అదిగాక, "పక్షీనాం కాకి చండాలి" యని యున్నది గనుక గద్దలే పయిభాగమున కర్హ్యములనెను.

గద్ద. - మాకే పయిభాగము కావలెను.

కాకి. - ఓహో! సరిసరి, నీ స్నేహ మేడ్చినట్లే యున్నది. మహా వేదాంతులు చచ్చినను వారి పిండములు మేము ముట్టనిగే పవిత్రములు కావుగదా? ఆ హేతువున మేము గొప్పవారము, మాకే పయిభాగము కావలెననెను.

గద్ద. - నీగొప్ప మండినట్లే యున్నది. ప్రజలు, కాకిలాగున్నా వేమిరా? అని నీచెడు పేరున అనేక బాలురను పిలిచెదరు.

కాకి. - నీలాగె, నీలాగే? పూళ్లో యెవరు కోడిపిల్లలు పెంచుకున్నా వాటిని శర వేగమున తన్నుకొని పోగా "మా యముండా గద్ద, పాడుగద్ద" అని నన్నే తిట్టుతారు. సిగ్గులేదు పూరుకో.

(కోపముతో)

గద్ద. - అవును నీమాదిరి పెంట కుప్పలలో పురుగు లేరితినము.

కాకి. - ఆ, నీలాగు చచ్చిన పాములను కుళ్లిన కళేబరములను

తినము లే? మంచి మంచి కవితాతలు గూడా, కాకమె కోమలిరూపము, అని కందపద్యములోగూడ, నరకన్య లతో సమానముగా పోల్చి పొగడుచుందురు.

గద్ద. — అదేమి పొగడడము నీ మొండిముఖము, యెగ్గు చేయుడమని యెరుగవా? నన్ను, హిందువులు విష్ణు వాహానమని పూజింతురు.

కాకి. — కావు, కావ్. మని రివ్వున యెగిరి కోపముతో తన జాతి కాకులను యుద్ధమునకు ప్రేరేపించి గద్దమీదికి తీసికొని వచ్చెను.

గద్ద. — కోపముతో తనజాతి గరుత్మంతులను పోగు జేసి వచ్చెను.

ఈ యిరుతెగలవారు నక్కయెదుట ఘోరయుద్ధ మొనరింప అనేకవేల కాకులు గద్దలు మరణించినవి, మరికొన్ని గాయములతో లేవక పడిపోయినవి. సమానులైన యిరుపక్షముల యుద్ధనాయకులు పటాపంచలైరి.

నక్క. — నవ్వుచు మూడేండ్ల పత్యమునకు పక్షి వరుగు సరిగా యున్నదని దినదినము యెండుపక్షి మాంసము తిని బలసి, గాయములు మాన్పుకొనెను.

నీతి

పంచకుల జగడములలోనికి బుద్ధిమంతులు పోగూడదు.

# బాలమిత్ర టపా




ప్రియమైన బాల మిత్రులారా:—

ఈ స్థలములో మా ప్రియమైన బాల మిత్రులందరివద్ద నుంచి వచ్చిన కబురులు వినగోరుచున్నాము. మీరు మాకు జాబులు వ్రాయవలెనని కోరుచున్నాము. సాధ్యమైనంతమట్టుకు అచ్చువేయ ప్రయత్నించెదము. మీ ఇంటి విషయము, మీ యన్నదమ్ములు, అక్క-చెల్లెండ్రు విషయము, మీ

ఆటల విషయము, మీవంటి ఇతర చిన్నవాండ్లు తెలుసుకొన గోరు దేని విషయమైనను మాకు వ్రాయండి. మీ బడి విషయము, మీ అయ్యావార్ల విషయమును వ్రాయవచ్చును.

మన కుటుంబము పెద్దదయి, తెలుగు దేశమంతట వ్యాపించినప్పుడు మన మొకరొకరికి సహాయపడవచ్చును. మన స్నేహితులలో కొందరు పాత పోస్టుబిళ్లలుకూడ బెట్టుచున్నారు. వీటి విషయము కూడ మీ జాబులలో వ్రాయవచ్చును. అలాగు కూడ బెట్టుచుండు ఇతరులతో మార్చుకొనవచ్చును.

చాలా చిమ్మెటలు సీతాకోక చిలుకలుగల యొక చిన్నవానిని నే నెరుగుదును. ఈయన వీటన్నిటిని ఒక వలతో పట్టుకొనలేదుగాని చిన్న పురుగులను తెచ్చి వాటిని కాపాడి, దినదినము వాటిని పోషించుటవలన అవన్నియు ఇప్పుడున్న సుందరాకారమునకు ఎదిగినవి. క్రమక్రమముగా చాలా మంది చిన్నవాండ్లు తనవలె చేయునట్లు, అయన కూడ మనకు వ్రాయవచ్చును. దేవుడు ఈ గొప్ప మార్పును ఏలాగు చేయుచున్నాడో గ్రహించినయెడల మన మందరమును సంతోషించవచ్చును. ఎందుకనగా ఆయన మన దేవుడు. ఆయన మనలను తనయొక్క మహిమ ఆకారమునకు మార్చుచున్నాడు.

మన మందరము ఆయన దృష్టిలో మిడతలవలె యున్నా మని వ్రాయబడియున్న సంగతి మీ రెరుగుదురుగదా? ఇది ఎక్కడ వ్రాయబడియున్నదో మీలో ఎవరైన చెప్పగలరా?

ప్రతినెల 20-వ తారీఖులోగా "బాలమిత్ర" పేరట మీరు వ్రాయు జాబులన్నియు తగిన సమయములో నీ టపాకు చేరును.

ఇట్లు మీ ప్రియ
"బాలమిత్ర"

# ఒక రాణి చూపిన దయ

స్పెయినుదేశపు రాణియగు విక్టోరియాగారు తమ తల్లి గారితోగూడ మాడ్రిడ్‌పుర సమీపమున మోటారు బండిలో నెక్కి షికారు చేయుచుండగా మార్గమున బడి యున్న ఒక జీవచ్ఛవమును జూచిరి. వారిద్దఱును దిగి వానికి తగిన యుపచారముల జేసి సజీవునిగా నొనర్చి తమ బండి మీదనే మాడ్రిడ్ పురమునకు గొనితెచ్చిరి. ఈ సంగతి పుర మందు తెలియగానే, జనులెల్లఱు మహా సంతోషముతో వారి నెదుర్కొని సన్మానించిరి.

## తోడేలు అవసానము

అవసానదశయందున్న తోడేలొకటి తన పూర్వపు చరిత్ర మునుగూర్చి విచారింప దొడగెను. "నిశ్చయముగా నేను పాపినేగాని మహా పాపులలో నొకడను గాను, కీడు జేసియున్నను, మేలునుమాత్ర మెంతగా చేసియుండలేదు. ఒకసారి మందనుండి తప్పివచ్చి అరచుచున్న గొఱ్ఱెపిల్ల యొకటి నాకు చాల దగ్గరగా నున్నను, ఒక్క నిమిషములో దానిపట్టి చీల్చ గలిగియున్నను నేనేమియు జేయలేదు గదా. అప్పుడె గొఱ్ఱె లన్నియు నన్నెంతో దూషించి యుపహాసించినను నే నెంతగా సహించితినో నాకు బాగుగా జ్ఞాపకమున్నది." అని చెప్పుచుండెను.

మరణము సమయమున నతని దగ్గరనున్న నక్క, "అవును, నాకు కూడ ఆ సంగతి చక్కగా జ్ఞప్తియున్నది. అప్పుడే మీ గొంతుకలో నొక యెముక గుచ్చుకొని మిగుల బాధపడుచుంటిరి. దానినే కదా, ఆ కొంగ బావ పెరికివేసి నది" అని జవాబిచ్చెను.

కీడుచేయ వీలులేక యూరకున్న యెడల మంచితనమేమున్నది?

PRINTED AT THE C. L. S. PRESS, MADRAS—1914